లాడుచును వచ్చె విటసమూహావిలంఘ్యు, మానవానాంచొర్య్యోల్లి దాసితల్లి. 119

వ. అయ్యవసరంబున. 120

గీ. అధికతరరోషభీషణవ్యాఘ్రిఁ జూచి, బెగడి నలుదిక్కులకుఁ బోవు మృగము పోలె
సందడింపుచు వచ్చునాజరతిఁ జూచి, ధారుణీదేవతనయుండు తల్లడిల్లి. 121

క. వచ్చెఁ గద విటులపాలిటి, చిచ్చుఅపిడు గింక నేమి సేయుదు ననుచున్
ఱిచ్చపడి యంతలో ధృతి, దెచ్చుక రక్షకుఁడు నాకు దేవ్రఁడె యనుచున్. 122

సీ. అల్లంతటనె రాఁగ నావలి కంతలో దాఁటలే నైతి నెచ్చోటి కైన
మును మున్న తెలిసి యీముదివరాటమునకై కొంచురా లేనైతిఁ గోకవాక
మోసపోయితి దీనిముంతవాటునకైనఁ జేకూర్పలేనైతి రూకరుట్ట
దాసీజనులకైనఁ దగఁ జెప్పి యూరలేఁ డనిపించలేనైతి హాణువుపప్పి

గీ. తొలుత నే బొంకినట్టిబొంకులు సహస్ర, సంఖ్య లవి యెల్లఁ దలఁచి రోసమున నేఁడు
వచ్చుచున్నది మాటలవశముగాదు, ధూళిదర్శన మే మైన దొరకదయ్యె. 123

వ. అని యనేకప్రకారంబుల వితర్కించి. 124

మ. ధరణీనాథ దరిద్రతాపిశునవస్త్రస్ఫూర్తి నాభారతీ
వరవంశోత్తమసూతి చింతిలఁగ నవ్వారాంగనామాతదు
ర్భరపాండిత్యముఁ జూచి దీనదశకున్ లాఁబోలు నీయయ్య జే
పరమేశా యనిపింపఁగా వలదె విప్రస్వామి నంచున్ మదిన్. 125

వ. చిరంతనస్నేహ మొక్కింత తలఁచి యాజగజంత యి ట్లనియె. 126

క. ఒకపండువ పబ్బంబున, నొకయూరట మైనవేళ నొక్కొక తఱి వే
డుకతనము గాక యిటువలె, సకలము వర్జించి నడువఁ జనునా యోయీ. 127

సీ. కడుఁ బిన్నప్రాయ మప్పుడ తాళిఁ గట్టిన కులమునిల్లా లెంత కుందవలయుఁ
బుట్టిని ల్లని పెట్టుపోఁత లాసించిన యక్కసెల్లెం డ్రెంత యడలవలయుఁ
దనయుండు మాకు ముప్పున కందు నని యున్న తల్లిదండ్రు లెంత చింతిలఁగవలయు
నందఱిండ్లకు నాసయై యుండు నితఁ డని నిక్కబందుగు లెంత పొక్కవలయు

గీ. చల్లఁగాఁ జేతికాఁ సెల్ల దుర్ల్లి లొల్లె, కాఁద వై యిఁక నైన నీకాఁపురంబు
బ్రదుకుపని విచారింప కీపనికిఁ జొరఁగఁ, బడినవానికి నెక్కడి భారబుద్ధి. 128

సీ. గుఱి తప్పిపోవు ముందఱివిచారము లేదు సావడి కుడుగు మచ్చరము పుట్టు
నగరివారు హసింతు రగ డౌను బిన్న పెద్దలకుఁ జుల్కన తలితండ్రు లోర్వ
రింటికి నేగి యా నెవరు మెచ్చరు లేని గర్వంబుదొట్టుఁ జేకాసు దల్లు
నొడ లోడఁగాఁ జొచ్చు నొడువులపాలగు సందులుఁ దూఱు విశ్వాస మెడలుఁ

గీ. చిన్నపనిగాదు లంజరిక మన్న వినుము, ప్రజలు మీ రొక నైన మాపయికి వచ్చుఁ
బరఁచెదవు నీవు మాబిడ్డ పసరుమొగ్గ, మ్రొక్కెదము రాకు నీ విదిమొదలు చేసి.

క. అనరాదుగాక నీ వొక, మనుజుఁడవా దుర్విదగ్ధమార్గమె మార్గం
బని విప్రమార్గ ముద్యా, పన నేతురె నిన్నువంటిబ్రాహ్మణకులజుల్. 130

గీ. జపతపంబులు గావు శాస్త్రములు గావు, వేదములు గావు సత్క్రియావిధులు గావు
వైదికపుబాప లేద భూవరకుమార, యోగ్యసౌభాగ్య లగువారయువతు లేడ. 131

క. పాప మని నిన్ను నీతిక, ళాపండితవాక్యసరణి లాలించితిఁ గా
కోపిన్నవాఁడ విటదు, ర్వ్యాపార మడంప లంజవారికిఁ బనియే. 132

గీ. అనుచు నయభాషణము లాడి యాపలిక్కి, మంచిమాటల నరుగఁ డీమాల్గుఁబోతు
కఠినతరవాక్యములచేతఁ గాని చక్క, గాదు లొటిపిటశూల రోఁకండ్లఁగాని. 133

వ. అని విచారించి యిట్లనియె. 134

క. మాకేమి నీవు పోయిన, పోకలఁ బోకుండఁ జేయఁ బొందువలసె నా
తేక చనుదేకు రూకలు, శోకలు నిష్ఫలము లైన గొడవలు తగునే. 135

గీ. చదువుకొన్నాఁడ పటుమీఁద సరసముద్ర, కొంత యామీఁద భూసురకులవరుండ
వయ్యయో నీవెఱుంగవే యర్థమీక, యూరకే పిల్చునే లంజవారిపడుచు. 136

క. ఇచ్చకపుమాట లాడుచు, వచ్చెదు మూణ్ణాళ్ళనుండి వదలవు నేడున్
బచ్చపయికంబు గుఱ్ఱము, వచ్చినదాఁకనె యటన్న సామెత వినవే. 137

గీ. మాఁట లికవేయు నేటికి నేఁటిరాత్రి, చీర పుత్తెంచె నుడిగాలవారిచేత
నూరియేలికరాజుకుమారుఁ డల్ల, పెద్దచౌకట్లపోవులపిల్లవాఁడు. 138

వ. అని యిత్తెఱంగునఁ గన రెత్తి విటులపాలిటిమిత్తి మర్మంబు లెత్తి పలుకుచు నత్తఱిం దత్తరంబున గృపాయత్తచిత్త యై తత్తరిలుబిత్తరిచూఁతుం గని బత్తిపడక యోసీ మొగమోటకత్తెవై వట్టిజిత్తులు సేయురిత్తముడికాంద్ర హుజుత్తనిపించక విత్తహాని చేసితి వని బెత్తంబు తీసికొని మొత్తఁ బోయిన. 139

క. ఈపాటి కదల కున్నక్, గోపంబున నన్నుఁ గూడఁ గొట్టును దీనిక్
దూపొడువంగలనే 'యా, శా పరమం దుఃఖ' మనుచుఁ జయ్యన నరిగెన్. 140

క. అనిన విని వదనకమలం, బున లేనగ వంకురింప భూనాయకుఁ డో
మునినాథ విప్రుఁ డెచటికిఁ, జనియెం దుద నేమిసేసె సకలముఁ జెపుమా. 141

## ఆశ్వాసాంతము.

మ. బహుళాపుత్రనిశాకళత్ర మునిశంపావిగ్రహాభోగసం
గ్రహవాంఛా గురుకామినీరతికళా ప్రారభ్యమాణాఘదు

ర్వహతానిర్మదనార్థదుస్సహతపఃప్రాబల్యసాఫల్యకృ
న్మహనీయైందవసత్కళాభరణరమ్యస్కంధసోమేశ్వరా. 142

చ. హతసుమబాణ బాణదనుజావసథాంగణవాస వాసవా
ర్చితపదపద్మ పద్మభవశీర్షవిఘాతనిదాన దానవ
క్షతికృతిదక్షదక్షమఖసంహృతికర్మధురీణ కీనదు
ష్కృతపరితాప తాపస సమృద్ధికళాలసమానమానసా. 143

ఉత్సాహవృత్తము. దండశూకభూష దోహదాహకా జగత్త్రయీ
కందసంశ్రితాచలేంద్ర కందరా పరాక్రమా
స్పందితాగసంస్తుతత్సుపర్వపర్వతాగ్నిది
క్కందుకారిపట్టణప్రకాండమండ నోదయా. 144

గద్య. ఇది శ్రీకాళీవరప్రసాదలబ్ధవర్ణవర్ణనీయకవిత్వ శౌరేయ పెదలింగనార్యగర్భాబ్ధిపా త్రేయ గురువరాచార్యపదారవిందమిళిందాయమానసకలవిద్వజ్జనవిధేయ రుద్రయ నామధేయప్రణీతంబైననిరంకుశోపాఖ్యానంబను మహాప్రబంధమునందు ద్వితీయా శ్వాసము.



శ్రీ ర స్తు.

# నిరంకుశోపాఖ్యానము.

## తృతీయాశ్వాసము.





తస్వీఛవసాయక
పీతనయాపేక్షవక్షవినిహతిపునరు
ద్భూతివిధాయక కటకీ
భూతభుజంగేశ కందపురసోమేశా. 1

గీ. అవధరింపుము తత్త్వవిద్యావివేక, దళితకామాదిరిపువర్గకలహకుఁ డైన
పులహుఁ డిట్లని పలికె నాభూవరేణ్య, శేఖరునితోడ వాక్యవైచిత్రి మెఱయ. 2

ఉ. వింటివె ధారుణీరమణ విప్రకుమారకుఁ డప్రబుద్ధి నా
కంటకురాలు పల్కినవికారపుమాటల దుఃఖితాత్ముఁ డై
యింటికిసైతముం జనక యీశ్వరసంఘుటనంబె తోడుగా
వెంట సహాయసంపదలు వేఁడక పోయె నరణ్యభూమికిన్. 3

క. పోవుచు నెదుట ధరిత్రీ, దేవతనూజుండు గాంచె దిగ్దంతిజిగీ
షావిశ్రుతమత్తేభఘు, టావార్యవిహారగహన మగుగహనంబున్. 4

సీ. కఠినకాకోలూకికావిలోకనసాధ్వసాక్రోశకోకిలాకోకిలంబు
కాద్రవేయమయూరికాసముత్కటకంఠఘోషార్తమూషికామూషకంబు
కరటికంఠీరవికాకర్కశస్వరవ్యాకులసూకరీసూకరంబు
కరివైరిభేరుండికాకఠోరాక్రంద కాతరకాసరీకాసరంబు

గీ. కురువకాశోకవకుళతక్కోలకేత, కీకురంటకకుటజకంకేళికతక
శాకతిందుకకింశుకక్రముకతిలక, కాంచనకదంబకలిత మక్కాననంబు. 5

వ. నిరంకుశతరంబుగాఁ జొరంబడిపోవు నెడ దురాలోకనిరాలోకశౌకపైకశాకాతిరేక
రేఖాకిమ్మీరితాకారప్రాకారంబునునిజభుజాదండకోదండపాండిత్యనపత్రాకృతనిష్పత్రా
కృతపోత్రీప లలపచనపర్యుత్సుకపుళిందసందోహదందహ్యమాననానామహిషపురీష
కరీషోల్లసితభసితస్తోమగృహాకుట్టిమంబును ప్రకటపటవిటపిఝాటపటలవేల్లితఝిల్లి

కార్ముకంకారప్రతిధ్వానసంధానచంగరంగమంటపంబునుపశ్చిమద్వారదారుతురంగకళే
బరచరద్గృహగోధికాగృహమేధికల్పితానల్ప సౌభాగ్యసూచకశకునాతిథ్యనిరంతరా
ళంబును నమందానందచలదుందురుచుచుందరీబృందసందీపితార్భటీనిర్భరగర్భగృహం
బుననగునొక్కపాడుగుడి గాంచి సముచితయానంబున గొబ్బునఁ జేరంబోయి గుబ్బ
తిలుగబ్బిలపురెట్టగబ్బు దను నుబ్బనీక తదనంతరంబునం గూర్చుండి పథశ్రమన
మాపనావసరంబున. 6

క. జననాథధారుణీశ్వర, తనయుఁడు తనయెదుట విమలతరకాంతులకున్
గనియగులింగముఁ గని యిట్లని పలికెన్ దైవఘటన కనుకూలముగన్. 7

మ. జగదాశ్చర్యకరప్రభావ మగునీసర్వజ్ఞవిఖ్యాతి యే
నుఁగు దిన్నట్టివెలంగకాయగతి నొందున్ లోన లోనై బయల్
సొగసై యుండెడిదో విశుద్ధతరమో చూడంగ నాతోడుతన్
సొగటాలాడెద వే నవేందుకుసుమస్తోత్రవ్యాజాటాంతికా. ౮

సీ. గిరిసార్వభౌముకూఁతురుసన్నిధానంబు నందు మేలము లాడునట్లు గాదు
కైలాసశృంగశృంగారచందనవాటి నల్లన నడయాడునట్లు గాదు
వెలిగిబ్బ నాకాశవీథిఁ బోడెంబుగా నవలీల నెక్కుడునట్లు గాదు
తొలివేలుపులమూఁకఁ దురములో గోరింపు లాడి తాండవమాడునట్లు గాదు
గీ. మానితద్యూతవిద్యోతమానకీర్తి, మన్నరాగ్రణి నైనట్టినన్నుఁ గూడి
జూదమాడుట సింధురాసురవిజేత, యార వెక్కసితన మన్న నంటిఁగాని. 9

లయగ్రాహి.—
ఓచరమభాగ్యభృతఖేచరదురోదరకళాచతురశేఖరుఁడవై చిరతరేచ్ఛన్
బ్రాచిఁగలప్రోడల నవాచిఁ గలజాణలఁ బ్రతీచిఁగలతజ్ఞుల నుదీచిఁ గలప్రజ్ఞా
సూచకుల నన్వహముఁ జూచితిఁగరాబ్జమునఁబాచికలుముట్టిచనఁజూచినమహాత్మున్
నీచరణ మాన వలయాచలపరీతనిఖిలాచల మెఱుంగ మిముఁ జూచుకొను టెంకన్.

గీ. వట్టిమాటలు గా వెంతవారి నైన, గెలుచునర్తికి నాపాలఁ గల దటంచు
నవనిసురతనూభవుఁడు చేలాంచలమున, ముడియ గట్టినసొగటాలు విడిచి పలికె.

సీ. వేళంబుగా నభోవీథి దువాళించుగిబ్బతేజీకినా కృత్తివాస
రింగులువారఁ దీర్చినవేయిచుంగుల తలపాగకా దేవతావరేణ్య
బిరుదురాకాసులఁ బరిమార్చుమువ్వంక పట్టెసకా మనోభవవిరామ
వలకారిచిన్నివెన్నెలకాయుపసిపూప జాబిల్లికా శైలజామనోజ్ఞ
గీ. పసిమిపసిదిండివలువకా ఫాలనేత్ర, వెండి నిండారుకొండకా విశ్వభర్త
లోకసామ్రాజ్యమహిమకా లోకవంద్య, యొప్పు పన్నిద మిందులో నొకటి కైన.

క. ఏలా పలవనిపడి నీ, చేలాయుంఛవాహనములు చేకొన మాకున్
వాలాయము గావించెద, ఫాలంబక లంజలంజ పన్నిదమునకున్. 13

వ. అని పలికి యమ్మహాదేవునివలనఁ బ్రతివచనంబు గానక యిట్లనియె. 14

క. పూనిన నోటమి తప్పదు, దీనికి మా టిడక యున్నదియె నయ మనుచున్
మానము దాల్చిన గుట్టునఁ, బోనీఁడు నిరంకుశుండు భుజగవిభూషా. 15

క. తగ నింతటి సర్వజ్ఞత, దిగనాడుము లేక నన్ను దీకొను దీనన్
"జగదిరుదు ముండమోపిరియుఁ", దగవే నీ వెఱుఁగవే సుధాకిరణధరా. 16

గీ. ఎన్నివిధముల మా టాడకున్నయట్టి, గట్టిపూనికి నీయందుఁ గలిగె నేని
దానికొకయుక్తి మునుమున్నె తలఁచినాఁడ,మిసుగవచ్చునెవిటశిఖాకుసుమమెదుట.

క. నీయెత్తు నేనె యాడెద, నీయెదలం బొంకులేక నీవిద్యకుఁ బ్రా
లేయాద్రిసుతాజీవిత, నాయక నెత్తంబు కారణం బెఱుఁగుదువా. 18

క. అని పాళి శైలకన్యా, స్తనపాళీనామకేలితామరసరసా
యనలోలుపాళియెదుటం, బొనరించె నిరంకుశవంశభూషణ మధిపా. 19

మ. ధృతి పెం పొందఁగ సారెసారె పయిసారెం జూచుచు న్సారె వో
వుతతిం బోవుచు జోడుగట్టుతటి రివ్వ ల్మీఱ జోడించుచున్
జత బారా పది దచ్చి యిత్తిగ దుగా చౌపంచ తీపంచ బొం
కితినాన ర్తకి యంచు నాడె నుభయాంగీకార మేపారఁగన్. 20

క. ఈరీతి నక్షవిద్యా, పారీణత మెఱయ నుభయపక్షజయాపే
క్షారూఢచిత్తుఁ డై ధీ, గౌరవ మెసఁగంగ నాడఁగా దైవగతిన్. 21

క. తనయాట గెలుప లక్ష్మీ, తనయాటవిదహనుఁ జూచి ధరణీసురుఁ డి
ట్లను మానవతీరత్నము, ననుమానములేక యొసఁగుమా నిపుణతమా. 22

క. మును లంజలంజ పన్నిద, మని యాడితిఁ గాని యిట్టి దట్టిది యని యా
డినవాఁడఁ గాను గద నా, మనసు సుమీ వారయువతి మన్మథమథనా. 23

సీ. అలకాధిపతిసూనుఁ డమరవేశ్యలలోన మే లెంచి పొందు నేలోలనయనఁ
బ్రధనరంగములోనఁ బ్రాణంబు లుంకువ గా నిచ్చి పోదు రేకలికితోడఁ
గ్రతుతంత్రముల దేవగణముల సంతోషపఱచి కాంక్షింతు రేపద్మనయనఁ
గఠినంపుతపములు గట్టిపెట్టి మునీంద్రకోటి యాసింతు రేకుపలయాక్షిఁ
గీ. త్రిభువనాశ్చర్యసౌందర్యరేఖచంచ, లాలతాంగుల కేయింతి మేలుబంతి
యాదురాపపరీరంభ యంకయుగ్మ, రామణీయకజితరంభ రంభఁ దెమ్ము. 24

క. విన్నావో వినవో నీతిన, మున్నతు లడిగించుకొనఁగ నొప్పనివి ధరన్
బన్నిదమును మఱియేదో, యన్నారుచుమీ మదావళాసురభేదీ. 25

తరల. తగునె పన్నిద మీక యీగతిఁ దప్పుమానము దాల్పఁగాఁ
దగవు నీకును నాకుఁ బెద్దలదండఁ బెట్టెదఁ జండి సై
గగనకేశ యటంచుఁ జందురుకావిసేలు గళంబునన్
బొగడదండ యొనర్చి వావిటభూసురాగ్రణి దిట్టయై. 26
గీ. తాము గనిపించ కుండి గంధర్వయక్ష, భుజగకిన్నరముఖ్యులు పొగడ దండఁ
బొగడదండయుఁబోలె నప్పొగడదండ, కాలకంధరు మెడ కలంకార మయ్యె. 27
వ. ఇవ్విధంబున నవ్విప్రకుమారుండు బుష్పకోదండజయవిరాజితుం బరాజితుంజేసి యి
ట్లనియె. 28
సీ. తగ వంటిమా నీకుఁ దగ వెక్కడిది భక్తిపారీణుసిల్లాలిఁ బట్టినావు
తెగు వంటిమా నీకుఁ దెగు వెక్కడిది వెండికొండ యుండఁగ భిక్ష గోరినావు
గుఱు తంటిమా నీకు గుఱు తెక్కడిది భక్తి నంబికిఁ గుంటెన నడచినావు
బిరు దంటిమా నీకు బిరు దెక్కడిది పాండునృపకుమారునకుఁ గ్రిందుపడినావు
గీ. దొరతనం బంటిమా నీకు దొరతనంబు, గలదె బాణునివాకిలిఁ గాచినావు
నిన్ను సర్వజ్ఞుఁ డని కొల్చునిర్జరాళి, నెన్ను టంతియ కాక నీ వేమిసేతు. 29
గీ. నీమహాధన్యవృత్తికి నీకు నార్య, భాగ్యసంపన్న గుణధుర్య భార్య యొక్క
చట్టుకూఁతురు గలుగ నీజాము వేగఁ, గాని లేకున్న మఱి చెప్పఁగలదె నిన్ను. 30
క. నీగూబజంకెలకు ను, ద్వేగపడం గుసుమశరుఁడె విటసింహుఁడు వే
వేగఁ గమలాక్షిఁ దెచ్చెద, వో గరుపతనంబు వాసి పో నెంచెదవో. 31
క. బరిదప్పి తప్పుచేఁతలఁ, బొరలక యిపు డోడినట్టిపొలఁతుకఁ దే నీ
యఱచేతఁ బండ్లు వచ్చినఁ, గఱతువుగా కిఘ్నుకార్ముకప్రతిపక్షా. 32
చ. అని యనిమేషభూరుహసుమాసమదామలలామవాసనా
ఖని యగుపార్వతీధవునికంఠమునం దగిలించినట్టికాం
చనమణిరుచ్యమాననిజశాటిచెఱంగులు గూడఁ బట్టి నీ
పని యన నెంత వేగిరమ పన్నిద మిప్పని తీయ నయ్యెదన్. 33
ఉ. సత్యవచోవిశేషపరిషక్తుఁడు గావున నోడియుండియో
యత్యధికుండు దేవుఁ డని యంజనిదౌష్ట్యము చూచి మెచ్చియో
భృత్యుఁడు వీఁడు మాధ్యమునఁ బేశలుఁ డంచు ననుగ్రహించియో
మృత్యుపదాపహంత యురరీకృతభూసురధూర్తమార్గుఁడై. 34
సీ. నిబ్బరంబున వచ్చి నిలిచినయూఁకున వెలిగిబ్బ యిరుగెలంకులకు దాఁట
గమనవేగంబున భ్రమసి కేయూరంపుదందశూకములు వక్త్రములు తెఱువ

నెగసి చివ్వనఁ గ్రుంకుగగనవాహినిప్రేంక మున జటాజూటంబు వెనుక కొరగ
జాఱి హస్తసరోజసన్నిరుద్ధాంతమై బెళబెళఁ బసివిండిపలుస మెఱయఁ
గీ. బతనభయసంభ్రాంగకపర్వతేంద్ర, కన్యకాబాహువల్లరీగాఢవేష్ట
నప్రపీడితాగ్రకల్పనాగము వేగ, సంభ్రమత వచ్చి హరుఁడు సాక్షాత్కరించె.
సీ. ఎంతదూరము పోఁగ నీశ్వరుం డని కౌరి విహగేంద్రుఁ బోఁడెంబు వెడల విడువ
నచ్యుతుం డెచటికో యరుగుచున్నాఁ డని బమ్మ యెక్కలతేజిఁ బరువుదోల
నజు డంత వెడలిపోయెఁ జుమియంచు సురేంద్రుఁ డైరావతంబుఁ గాలాడిపఱవ
నింద్రుఁ డూరక పోవ డెచటికో యని వహ్ని పొట్టేటివారువంబును గదల్ప
గీ. వాఁడె శుచి యంచు యమనైఋత్యవరుణులాత్మ,వాహనంబులు జోడింప వారిఁ గూడఁ
బవనపౌలస్త్యపశుపతుల్దవనరూఢిఁ, బరఁగుతమసాహిణముల నిబ్బరము చూప. 36
వ. చేర వచ్చి రప్పుడు. 37
క. గజగజ వడఁకుచు భూసురుఁ, డజగబుభరుఁ జూచి సాధ్వసావేశమున
న్భజనంబు మఱచి యుండిన, రజనీకరమౌళి సాదరముగాఁ బలికెన్. 38
ఉ. ఓడకు మోయి భూసురకులోత్తమ నెత్తమునందు నీకు నే
నోడితి నీవు గెల్చితి సమున్నతి నన్నతిరోషవృత్తి నీ
వాడినయంతవట్టు సహజార్థమ యర్థమహాభిలాషి వై
యోడినపన్నిదం బిడక యుండినఁ జండినకాఁ దలంపరే. 39
క. అరిపురము లభ్రచరములు; గిరికార్ముకకలనఁ గలన గెలిచినవన్నె
ధర నాటపాట గెలిచిన, నిరుపమసాహసికమణివి నీకుం జడుపే. 40
క. అని భయము దీర్పఁ దీర్ప మ, దనహంతకు నంతకుం బదంబునఁ బ్రహరిం
చినయధ్వరోపరంతకు, మునుకొని దండప్రణామములు చేసి తగన్. 41
గీ. పూలనేసినవాని నిర్మూలపఱచి, జాలనేసినవాని హారాళి మైన
లీలఁ గరుణించితివి దయాశీల నీకుఁ, జాల నపరాధి నంచు నాకేల వెఱవ. 42
ఉ. ఓపరమాత్మ సన్నుతగుణోన్నత యున్నతలంపు లేల ల
క్ష్మీపతిసేవ్యమాన మగుమీజగదద్భుతమూర్తిఁ గంటి నా
పాపము లోప మయ్యెఁ గడుఁ బాత్రచరిత్రుఁడ నైతి నింక నీ
శ్రీపదపంకజాతములు చేరుపవే కృప వేగ నావుడున్. 43
శా. ఓహో నిల్వు పయోరుహాసనకులోత్తంసంబ సత్యాహత
వ్యాహారంబులు పల్క సాగితివి బా గాయెం జుమీ నీ వరా
రోహారత్నము నీవు సైకొనక కోర్కుల్మీఱఁగా ముక్తికాం
తాహారాళిసుఖంబు గోరెదవు జూదం బాడితే నీనికిన్. 44

ఉ. ఆడితి మున్ను బొంక నని యక్షవిచక్షణవృత్తి నేల బొం
కాడెద వాడకాడకు నలాసనవంశపయోధిచంద్ర నే
నోడినయంతె కాక మఱి యున్నపదార్థము లేయ నేర్తునో
పాడియె నీకు వేఁడ సరిపన్నిదగాండ్రు హసింప నియ్యెడన్. 45

వ. అని యనేకప్రకారంబుల నాతనితో మేల మాడి యి ట్లనియె. 46

ఉ. భూసురవంశపావన యపూర్వతరంబునుగాదు ముక్తికాం
తాసుఖ మేల కోరెదవు దానికి సందియ మింక మానుమా
దాసుఁడ వీవు నాఁడివిజతామరసాక్షి గ్రహించి మానసో
ల్లాసము నొంది మమ్ములఁ దలంచుచు నుండఁగఁ గొన్నినాళ్ళకున్. 47

క. అని పలికిన విని భూసుర, తనయుఁడు సాష్టాంగ మెరఁగి తగ ని ట్లనియె
న్నినుఁ గనినయంత ముక్తికి, ననుమానమె తెలియఁ జాల నైతిం జడతన్. 48

మ. అపరాధంబులు పెక్కు చేసితి మహాహంకారకామక్రియా
విపులాంభోనిధిఁ గ్రుంకువెట్టి జడతావేశంబున న్నిమ్ము ది
వ్యపథోద్వృత్తినిఁ గొల్వ నైతిని మనోవాక్కాయకర్మంబులం
జపలాత్ము న్ననుఁ బ్రోవ మీదయయ కా సాక్షాత్కటాక్షేక్షణన్. 49

మ. నిలుపం జాలను నీశివాఖ్య మదిలో నిక్కంబుగా నీకథల్
బలుకం జాలను వాక్కులన్ వెలయ నీపాదాబ్జసంసేవనల్
గెలువం జాలను దేహకర్మములు దుష్కృత్యాత్ముఁడన్ నామన
శ్చలనంబు ల్దొలఁగించి ప్రోవవె శివా సద్భక్తరక్షాచణా. 50

ఉ. దేవ మహానుభావ జగతీధరకార్ముక దుర్భవాపహా
మావరరోప భక్తజనమానససారసలోకబాంధవా
గోవరవాహ దుర్వినయకుంతితకానన దావపావకా
ప్రోవఁగదయ్య మృత్యుహర మూర్ఖుని నన్నొకకాశ్యపీసురున్. 51

సీ. ప్రణవనృత్యభిరామ రామాసహితవామ వామాహిరాడ్దామ సామకామ
రజనీచరకిరీట రసజాసనకరోట గగనగంగాజూట నిగమఘోట
యచరాచరాధార యచలాధరాగార నీరధితూణీర నిగమసార
దురితాభ్రవాతూల కరధృతాసమశూల నాగాజినదుకూల నయవిశాల

గీ. దళితభవసైన్య యాదిమధ్యాంతశూన్య, హితజనశరణ్య సర్వలోకైకమాన్య
నిరుపమాగణ్య విస్ఫుటానేకపుణ్య, సత్కృపానన్య దీనరక్షావదాన్య. 52

క. జయజయ శర్వ సదాశివ, జయజయ రతిరాజవిజయ జయజయ మృత్యుం
జయ జయ మాం జయపాలా, జయశీలా సకలభక్తజనతాలోలా. 53

వ. అని యనేకప్రకారంబుల నుతించుచుఁ గరతలకమలాంజలిబంధప్రసిద్ధసిద్ధాంతానంద దేదీప్యమానమానసుం డైయున్న యవ్విప్రకుమారుఁ బల్మాఱు గారవించి దదాహ్లా దంబగునట్లుగా నభయం బొసంగి పదఁపడి యమరలోకసాంద్రతరంగిణీంద్రచంద్రుం డగునింద్రు నిస్తంద్రత నాలోకించి విరించిప్రముఖాంచితపదపంకజుం డగుశంకరుం డి ట్లనియె. 54

క. వినుము సురేశ్వర భూసుర, తనయున కిపు డేను మెచ్చి తగ నిచ్చితి రం
భను దానికి నెల విమ్మా, వనజాసనకులవరేణ్యువర్ధను నెనయన్. 55

గీ. అనిన విని పాకశాసనుఁ డామహేశుఁ, జేరి దండప్రణామము ల్సేసి పిదప
నూరుజితరంభ కఠినవక్షోజకుంభ, హసితకరికుంభ యగురంభ కనియెఁ గాంచి. 56

క. ఓనాతి యీమహీసుర, సూనునకు నభీష్టకామసురతక్రీడా
మానసుఖ మొసఁగి రమ్మన, నానలినాక్షియును మంచి దని మ్రొక్కె తగన్. 57

వ. అట నుండె. మహేశ్వరుండును నిఖిలామరసమేతంబుగా నంతర్ధానంబు సేసె నమ్మహీసురసూనుండును నాదివిషన్నారీరత్నంబు నవలోకించి చేరం జనుదెంచి విస్ఫుట ప్రౌఢాలింగనం బొనరించి పునఃకృతపరిరంభణంబు న్వాలయ వెలయుచుండి రయ్యిరువురు. 58

సీ. చందనమాలూరమందారకేయూర తిందుకాశోకమాకందకుంద
కేతకీవకుళకంకేళికానవనీపతాలహింతాలజాతీలవంగ
ఘనసారకదళికాక్రముకామలకనింబ జంబీరబదరీరసాలసాల
ప్రముఖపుష్పితలసత్ఫలితపల్లవిత విస్తారభూమీరుహతతుల వెలయు
గీ. నట్టితత్కాననమునందు నవ్యకీర, రవము లుప్పొంగ నిందిందిరములు మెలఁగఁ
గోకిలలు గూయ మృగములమూఁకడాయ, మరుఁడు సుమశరమున నిరువురను నేయ.

క. ఉపవనమునఁ బొలె విహా, రపరవశు లగుచును దిరిగి రయమతి నతిర
త్యుపరతి సమరతి మతి మతి, నిపుణతఁ బెనఁగొనిరి చెలఁగు నేర్పులకోలఁదిన్. 60

వ. ఇట్లగణ్యాపుణ్యాలావణ్యాతరకరకంకణఝుణఝుణత్కారనినాదంబు లెసఁగం గౌఁగిలించుచు నిబ్బలిక నుబ్బి గొబ్బున గుబ్బటిల్లుగబ్బిగుబ్బలనురంబునం బొరయ నురుముచుఁ గంధరాపరిరంభణంబుల మొగంబు మొగంబునం జేర్చుచుఁ దిరస్కృతకిసలయ బింబాధరసరసమృదులసన్మాధురీధురీణామృతంబులోలుక మదనకదనదాహంబుదీర్చుచుఁ దదధరసుధారసంబు గ్రోలుచు రదనక్షతంబులు గావించుచు నంతకంతకు నెక్కుడై నిశితాంతదురంతలతాంతమార్గణగణాగణితాగ్నికీల లుద్ధతి వొలయింప హుమ్మని బిట్టొదవుతమకమ్మునఁ గ్రమ్ముకొను బిగిచన్నిట్టల దట్టంబున దిట్టంబుగ బెట్టైనయుఁ బిక్కటిలుమణిఖచితమహారజతకంచుకంబు విపియ నుట్టిపడునిట్టూర్పు లుల్లసిల్ల బయఁగ

పారావారాంతశ్చలన్మందరగిరంబు తెఱంగు గనిపించుచు ముద్రిత: బెనంగుచుఁ గుచ
కుంభలనఖక్షతార్ధచంద్రోదయంబు లుప్పొంగ మందస్మితచంద్రికలు వెలుంగ స్వేద
కణతారకామండలంబు వెలయ నేత్రకువలయంబులు ప్రకాశింపఁ దివ్యరాత్రకయ్యం
బన్వయించి యించుక నిదురించి మేలుకాంచి హస్తారుణోదయకిసలయంబులఁ గలితా
లకాంధకారంబులు దొలంగ న్సవరింప వసతోషణంబుల ముఖకమలంబులు వికసింపఁ
గంచుకోత్తరీయోదయరాగంబులు చక్కఁగాఁగఁ గుచకోకంబులుండాఁగ స్వేదకణనఖ
క్షతతారకాబ్జంబులు గ్రుంక మానసానందామృతాసననిషేచనానంతరనిటలతట
పూర్వదిగ్ధృతకుంకుమవర్తులతిలకాబ్జబాంధవోదయానంతరంబున. 61

క. ఆసుదతి ముదమెలర్ప మ,హీసురసుతుఁ గౌగిలించి హితమతిఁ బలికెన్
ఏసతి పుణ్యవతియొ నీ,తో సురతముఁ నిరతమెనయుఁ దొంటిఫలమునన్. 62

క. ఈతీరున సురతసయుల, రేత్రను వసియించె నెఱుఁగఁ జెప్పెడి జేమీ
రాతిరి పగలై పగలే, రాతిరియై వెలయుచుండె రతిపరవశతన్. 63

క. మనసిజకేళికి భూసుర, తనయా నీసాటి రారు దలఁపఁగఁ నేలా
యనరాదు గాని దాసులు,వినుమా నలకూబరాదివిజయవిశాలుల్. 64

క. అని దివిజకాంత భూసుర, తనయునిఁ గీర్తించుచుండెఁ దా మోహితయై
విను సుగుణ నీవు గావున, ననుఁబొగడితి వనుచు ననియె నాభూసురుఁడున్. 65

క. అపు డావ్విజుఁడును దివిష, చ్చపలాయతనయనఁ గూడి చనుదేఱఁగ నా
విపులారణ్యముచెంగట, నుపమాశూన్యమగుపురము నొక్కఁడు గాంచెన్. 66

వ. గాంచి తత్పట్టణంబు చేరం జనుదెంచి. 67

క. అచ్చట సుఖులై వారు వి,యచ్చరరాడ్భోగ మెనయ నతులప్రౌఢిన్
బచ్చవిలుకానికేళుల, నిచ్చ మెయిం జరుపుచుండి రిరువురు వెలయన్. 68

## ఆశ్వాసాంతము.

చ. ఘనఘన నవ్యనవ్య సితకంధరకంధర దానదాన వే
ధనధన తప్తతప్తకృతతారకతారకధామధామ వా
రణరణరంగరంగదరిరాజితరాజిత దారుదారు కా
వనవన ధీనధీనవృషవాహనవాహన సోమశేఖరా. 69

మాలిని. గగనపురజిగీషాకాలకూటాన్నతోషా
నిగమచరసువేషా నేకపుణ్యప్రభాషా

యగణితఫణిభూషా హార్యచాపామనీషా
విగతసకలదోషా విస్ఫుటానన్యపోషా. 70

క. మోహజ్వరభైషజ్యస, మీహితకైలాసరాజ్య మేదురతేజా
జేహీయమానదానవ, బాహాధాష్ణ్యజ్యత్రిదివపాలకపూజ్యా. 71

గద్య. ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధ లబ్ధవర్ణ వర్ణనీయకవిత్వతత్త్వధౌరేయ పెదలింగనార్య గర్భార్ణవపూర్ణిమాత్రేయ గురుపరాచార్యపదారవిందమిళిందాయమానమానస సకలవిద్వజ్జనవిధేయ రుద్రయనామధేయప్రణీతం బైననిరంకుశోపాఖ్యానం బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



శ్రీరస్తు

# నిరంకుశోపాఖ్యానము

## చతుర్థాశ్వాసము.





రమణీరమణీయప
రీరంభస్నేహవిస్ఫురితసాయక ని
ర్దారితసుమనస్సాయక
భూరికృపావేశ కందపురసోమేశా. 1

గీ. ఆవధరింపుము తత్త్వవిద్యావివేక, దళితకామాదిరిపువర్గ కలహుఁ డైన
పులహుఁ డిట్లని పల్కె నాభూవరేణ్య, శేఖరునితోడ వాక్యవైచిత్రి మెఱయ. 2

క. ఆరీతి నతఁడు దివిష, న్నారీతిలకంబుతోడ ననువుగ సురతా
పారవ్యాపారశ్రీ, పారగభావమున భ్రాంతిపడి వర్తిలుచున్. 3

వ. ఒక్కనాఁడు తనతోడఁ గ్రీడింపఁ ద్రిదివంబుననుండి వచ్చినయయ్యచ్చరలేమయుం
దానును విలాసార్థంబుగఁ బురంబు వెడలి. 4

సీ. సరసీరుహనవీనతరసీధురసపానభసలసుందరగానభాసమాన
ఘసమానసహకారలసమానఫలవారసమాదరశుమారసమదకీర
మవనాదరణదారవవనాలసవిహారభవనాగవిస్ఫారభవ్యహార
మవమానలవదూరపవమానసంచార భవమాంద్యవిస్తారఫణివిహార

గీ. మంచితవిహంగమము రాజహంసచంచు, దళితఫలసారజలపూరమిళితఫలిత
కలితఘనశాలినవశాలిఖండమండ, లావరణదీవ్యమానముద్యాన మొకటి. 5

గీ. చూచి యచ్చోటిమహిమకుఁ జోద్యపడుచు, ముమ్మరంబుగ బూఁదేనెముసురుగురియ
నచ్ఛతరగుచ్ఛములమీఁద నళులు గ్రమ్మ, దెప్పరం బగులేఁదీఁగె చప్పరమున. 6

సీ. వదనచత్వరవిసృత్వరరసజ్ఞారవో న్నిద్రతాదిక్కూలముద్రుజంబుఁ
గనకకణఘుణత్కారసముత్పాతపంచాంగుళప్రియంభావుకంబు
మధురాధరోష్ఠసమంతాన్నిపీడసాధ్యత్యానుకంపామితంపచంబు
నజ్ఞాతపూర్వరత్యాన్నత్యాభువరుపక్రమణయాచ్ఞావచోభ్రంలిహంబుఁ

గీ. గాంగసురతంబు సల్పి యక్క్రమలముఖియు, నామహీసురతనయుండు నంతఁ జాల
నలసి వలయితదివ్యాంబరావృతాంగు, లగుచుఁ దమచేఁతలకుఁ దామె నగుచునుండి.

ఉ. జారినకుంతలంబులు పొసంగఁగ దువ్వుచుఁ జల్వపయ్యెదన్
దోరపుఘర్మబిందువులుఁ దూలఁగ వీవుచు విడియంబుక
ర్పూరపువాసన ద్రిశలఁ బొల్పడ నించి మనోభవాహవో
దారకళావిశారదుఁడ వౌదువురా యని తన్ను మెచ్చుచోన్. 8

వ. యదృచ్ఛగా నభోమార్గంబునం జనునారదుం గాంచి యాచిగురుఁబోఁడి కతం
డి ట్లనియె. 9

సీ. కారుణ్యరసపూర్తికమనీయతనుయష్టి చిగిరించె నా జటాశ్రీదలిర్ప
నమృతఘనీభావ మనఁగ నొప్పువిభూతిధవళితాంగమరీచి దివిఁ జెలంగ
హస్తాంబుజంబుపై నాడుషట్పదపరంపర నాఁగ రుద్రాక్షమాలదనర
సముదంచితానందజలధి ఘూర్ణిలుమాడ్కి మారుతాహతిచేతమహతి మ్రోయ
గీ. ప్రకటతేజోవిశేషంబు బాలసూర్య, సృష్టి గావింప నయనసంతుష్టి గాఁగ
నరుగుదెంచుచు నున్నవాఁ డభ్రవీథి, నితఁ డెవ్వాఁడు దివిజపూర్ణేందువదన. 10

క. అని యడిగినభూసురునకు, గనుసన్నయొనర్చి దేవకాంతామణియున్
మునికుంజరుం దెలింగెను, తను రంభగ నతని విప్రతనుజాతునికన్. 11

ఉ. భూసురపుంగవుండు మునిపుంగవుఁ గన్గొని యీతఁ డెవ్వఁడో
తా సురకాంత యంచుఁ బలుకం గనుగిటె స్వనామగోపనే
చ్ఛాసముదీర్ణతన్ దివిజసంయమియున్ దెలిసె న్నతోత్సవా
భ్యాసుల సంతతోక్తిపరిహాసుల వారలమర్మకర్మముల్. 12

వ. అపుడు నారదుండు తనమనంబున. 18

క. ఇది నాఁటనుండి యీతని, మదనక్రీడావిశేషమధురిమగుణసం
పద వీడి రాదు నిర్జర, సదనమునకు ధాత్రి విడిచి సతతము నారా. 14

ఉ. ఉండెన నుండనీ యితనియొద్ద మనోభవకేళిలోలయై
దుండగ మన్న నెంత యిఁకదుర్గుణదూషిత గాక మా కయో
దండ మనంగరాదె వెసఁ దానును వాఁడును వచ్చి కైతవో
ద్దండత చూపఁగాఁ దగునె తాపసముఖ్యులతోడ దుష్టతన్. 15

శా. కానీ దీనికిఁగా నొకానొకప్రసంగం బింద్రునొద్దన్ వచో
నూనప్రౌఢిమఁ జెప్పి కొంతకలహంబుం బెంచఁ జోటుండఁగా
నానాభూముల కేగ నేటికి వృథా నాకంబు చేరం జనం
గా నిట్టిప్పుడె వేళ యంచు జనియె న్గౌతూహలాభ్యున్నతిన్. 16

వ. అంత నక్కాంతాతిలకం బాతనితో ని ట్లనియె. 17

ఉ. ఎక్కడివాఁడ వోయి యొకయింత యెఱుంగవు బుద్ధికౌశలం
బెక్కడ కేగె నాలుకవయి న్నవగ్రించియు నాననట్టి బ
ల్తిక్కరి నారదుం డతఁడు దైవతమార్గమునందు నేగఁగా
నక్కట నన్నుఁ జేర్కొనితి వాతఁడు విన్న ననర్థమొందడే. 18

క. ఆతఁడు విన్నప్పుడె పురు, హూతుఁడు వినుటయును బుద్ధి నూహింప శచీ
నేత విని నేని వెత యగు, చేఁతయె కాఁ దెలిసికొనుము సిద్ధము గాఁగన్. 19

గీ. మనము చేసినసుకృతసంపద నతండు, వినక పోయిన బ్రదికితి మనఘవర్య
విన్నయప్పుడె యొకకీడు వెదకుఁ గాని, మాని పెట్టినతంత్రంబు గానలేఁడు. 20

క. ఆమాట విని యొకించుక, భూమీపతి నవ్వి మానిపుంగవ కరుణా
ధాముఁ డగు నారదునకే, భామామణి యింత యేల భయపడియె నొకో. 21

వ. అని యడిగిన ధర్మశీలునకుఁ బులహుం డి ట్లనియె. 22

సీ. దివిజకాంతామణి యవనీస్థలంబున కరుదెంచు టపరాధ మౌన కాద?
యదియునుంగాక మోహావేశమున మర్త్యు ననుభవించుట నేర మౌన కాద?
యింతమాత్రమె చాల కేప్రొద్దు వాకిలి ననుకూల యాట తప్పౌన కాద?
యది కారణంబుగ నమరేంద్రు సేవకు నరుగమి యాగడం బౌన కాద?

గీ. చూడ మా యెన్నివిధములఁ జూచికొన్న, రంభయెడ దుండగమె ధరారమణవర్య
యది యెఱిఁగి చేరరాదయ్యె నమరమాని, కొండెగానితనానకు గురువు గాన. 23

గీ. భూసుపర్వున కొకనాఁడ పోయి కాఁగి, లిచ్చి రమ్మని పంపినాఁ డింతె కాని
సంతతము వానితోఁ గేళి సల్పుమనుచుఁ, బనిచెనే తన్ను లోకైకభర్త యైన. 24

క. ఈమాటలు ముని దివిజ, స్వామికి వినిపించెనేని జననాథ యతం
డే మని శాసించునొ యని, యామాసిని యతని కంత యలికెం జుమ్మీ. 25

వ. ఇది యిట్లుండె నట నారదుండు చని యెదుట హాహాహూహూముఖ్యవిఖ్యాత
గాయనగేయనవీనమాధురీఝరీతరంగనినదాయమానమేనకాద్యప్సరస పాత్రవిచిత్ర
కంకణఝుణఝుణత్కారచామీకరమేఖలాకింకిణీఘుళఘుళనూపురకలకలధ్వనులచే సం
తసించుచు సంతతవందమానత్రయస్త్రింశత్కోటిదేవతాసంసేవ్యమానుండై రత్నసిం
హాసనంబున నాసీనుం డై యున్నసహస్రలోచనుం గాంచి నిలిచిన. 26

క. మునినాథుఁ గాంచి సురపతి, ప్రణుతసమారాధనార్ఘ్యపాద్యాదివిధు
ల్వినయమున నొసఁగియర్హా, సనమునఁ గూర్చుండ నునిచి సలలితబుద్ధిన్. 27

క. మునియనుమతిఁ దానుచితా, సనమునఁ గూర్చుండి సత్ప్రసంగంబున నో
యనఘాత్మ యిచటి కరుగుచుఁ, జనుదెంచితి రిటకు నాదుజన్మఫలమునన్. 28

క. అన విని ముని దరహసితా, ననమున సురలోకనాథ నానాదిశలం
జని భువిని బత్రమొక్కటి, గని వచ్చితి మీకుఁ దెలుపఁగాఁ బనిగలనై. 20

క. మునినాథ యేమిచిత్రము, గనుగొంటివొ యానతీయఁ గదవే యనిన
న్వినవోయి నముచిసూదన, యనిమిషతరుణీలలామ యపనీస్థలిలోన్. 30

క. అలనాఁటనుండి ద్విజునిం, గలగొని యిట రాక యుండెఁగా దానికి నా
యిలవేల్పు యిలువేలుపు, బలభేదన యేమిచెప్పఁ బనియున్న దిఁకన్. 31

క. సురతనయులసురభోగము, నిరసింపఁగ వింటి దాని నేమనఁ గల వో
సురనాథ నిన్న యనవలెఁ, బరిపాలన యిట్లు చేయఁ బఱపితి వనుచున్. 32

గీ. కాన నీభోగసంపద ఘనము నచట, సొంపు పెంపును రంభకు నింపు పుట్ట
దనుచుఁదోఁచుచు నున్నదోయనిమిషేంద్ర, మానవులమీఁదియధికసమ్మదము చూచి.

చ. మనసలకూబరాదు లవమానము నొందెద రంచు నాఁడె యో
యనిమిషలోకనాథ యది యాధరణీసురపుత్రుతోడ నా
డినవచనంబు లెల్లఁ బ్రకటింపను నట్టివి బైట పెట్టఁగా
మునులకు మాకు నేల విను మోహముగా కది దానిపాపమే. 34

చ. అన విని వజ్రి మండిపడి యౌ నవు నారద యుద్ధురాత్మురా
లని మిపలోకభోగభర మల్పముగాఁ దలపోయ కున్న న
మ్మనుజుని బాయ కున్నె బళి మంచిది దానికి నేన గర్వముం
బెనిచితి నిన్నినాళ్లు నిఁకఁ బెద్దఱికం బొకయింత కుంచెదన్. 35

ఉ. ఓమునిసార్వభౌమ సరసోక్తులబాపనిమిండగాసి తా
నే మని నింద సేసె జగదీడితరూపవిలాససంపదు
ద్దామశరీరులం బ్రదశధామకుమారుల లంజసాని నే
ర్పో 'మనస శ్చ్యనాం ఘృత మరోచక' మన్నలు కాచరించునే. 36

సీ. యజ్ఞతంత్రములందు హవిరన్నములచేతఁ బుంఖీభవించినపొట్టక్రొవ్వు
జగదేకసౌందర్యచాతుర్యములచేత దుర్వారతర మైనగర్వరేఖ
సురతనూజులతోడిసురతసంసర్గచే గందళించినమహానందగరిమ
నిపుణత దీపించునృత్యవైఖరిచేతఁ బెంపావహించినపెద్దఱికము

గీ. సరససంగీతసాహిత్యపరిచయమును, బ్రథిమ చెందినబహుమానపాటవంబు
కొంత దివ్యులఁ లోఁకలఁ గొఱఁతపడఁగఁ, గొఱఁత వేయింతుఁ గను దీనికొఱకుదాని.

వ. అని పల్కు నవసరంబున.

సీ. మోవిపైఁ గనిపించుములుపాఁడిపలుకొక్క భాగిఁ జిక్కి కెంపులపోలుఁ జూప.
జెక్కులపై జాఱి చెదరుకుంతలములు మకరికాపత్రసంపద వహింప
జిగిగుబ్బచన్నులఁ జిటులుగంధపుసరుల్ జలుఁగుఁ బయ్యెదలోనఁ జెంగలింప
నలువొందునునుమేని నవనఖాంకురములు బాలేందురేఖల పస హసింప

గీ. జాఱుఁగొప్పున ముడిచినజాజివిరుల, తావితనతోడియచ్చరతల్లిరుఁబోండ్ల
కైశ్యకల్పప్రసూనసౌగంధ్య మడఁప, రంభ చనుదెంచె దేవతారాజసభకు. 39

గీ. వచ్చి భయభక్తు లెసఁగంగ వాసవాదు, లైనపెద్దల కొకపాటి యాననంబు
వంచి మడిసందులను హస్తవారిజంబు, లిడి యొకించుక వెనుకకు నేగి నిల్చె. 40

క. తనజాడ లన్ని యచ్చటఁ, గని వచ్చినయట్టివానికంకిరవు న
య్యనిమిషసంయమిఁ గని య, య్యనిమిషలోచనకు హృదయ మట్టిట్టయ్యెన్. 41

ఉ. అప్పుడు వాసవుండు కడు నాగ్రహ మొప్పగ నత్తలోదరిం
దప్పక చూచి నిన్న వసుధామరసూతికిఁ గౌఁగిలిచ్చి నే
నప్పుడ రమ్ము టంటి హరునాజ్ఞ యలంఘ్యము గానఁ గొల్కి మై
నెప్పుడు వానితోడ మది నిష్టము సల్పుచు నుండు మంటి నే. 42

క. ఏమీ వరచామీకర, భూమీధరకటకకుంజపుంజక్రీడా
సామీచీన్యము మానవ, ధామవిహారంబుఁ బోలదా దుష్టమతీ. 43

గీ. చంచలింప కిట్టి సాహసకృత్యంబు, చేసినావు గాన నోసి పోయి
భయదరూప మైన పాషాణ మై పుట్టు, పల్లవుఁడు వసించుపట్టణమున. 44

క. అని శాప మొసంగిన య, య్యనిమిషవిభుఁ జూచి రంభ యత్యంతభయం
బున సాగి మ్రొక్కి కరుణా, జనకంబుగఁ బలికె నముచిసంహారకుతోన్. 45

ఉ. ఈమహనీయశాపమున కెయ్యది యంతము దెల్ప వయ్య యో
యామరలోకనాథ సదయంబుగఁ జూడఁగదయ్య యో శచీ
వామదృగీశ నాకలుషవర్తన మెన్నకు మయ్య యోసుర
స్వామి యటంచు వే పగల సన్నుతి సేసిన నార్ద్రచిత్తుఁడై. 46

క. రమణీ తప్పదు నాపా, క్యము పాషాణత్వ మొందు మది యెన్నటికిం
దుమురై ధరణిస్థలిఁ బడు, నమరఁగ శాపమును నాఁటి కంతము నొందున్. 47

వ. పొమ్ము ధరిత్రినిం బుట్టు మని నియోగించి కొలువు చాలించి శచీకాంతుఁ డంతర
పురంబున కరిగె సురగరుడోరగాదు లందఱుఁ దమ నివాసంబులకుఁ జనిరి తదీయ

ద్వేషిణు లగుకలభాషిణులు కొందఱు సంభ్రమానందములై గృహంబున కేగిరి తదీయ సఖు లగు సరోజముఖులు కొందఱు వచ్చుచు వెంటన చనుదెంచి రప్పుడు రంభ దుఃఖితాంతరంగ యై వారల మగుడించి పుడమి కేతెంచి నిరంకుశునిం గాంచి శోకభరం బాపలేక.

చ. జలజముఖీనవీనసుమసాయకుముంగఱ మందరామరా
చలపరిమాణ మైనబిగిచన్గవ యూర్పులఁ బిచ్చలింపఁగా
సొలసక యేడ్చె గాఢతరశోకతటాకము చాల నిండి రెం
డలుగులఁ బాఱె నో యనఁగ నశ్రుకణంబులు జాఱఁ గన్నులన్. 49

వ. ఇవ్విధంబున నివ్వటిలునెవ్వగల నేడ్చువధూమణిం జూచి యతం డి ట్లనియె. 50

చ. నెరయ విషాదహేతువుగ నీ తెఱఁగన్నుల నశ్రుబిందువు
ల్గారఁగ నెఱుంగ మెన్నఁడు కుతూహలకారణబాష్పజాలము
ల్గురియుటె కాని నేఁడు కనుఁగొల్కులవెంబడి నశ్రుపూరము
ల్వఱపలు గట్ట నేడ్చెదవు వారిజలోచన యొప్పఁదెల్పవే. 51

చ. తలఁపున మాటలం గ్రియలఁ దామరసేక్షణ నిన్నె కాని యే
పొలఁతుల నొల్ల నీనిజము పుష్పశరాసనుఁడే యెఱుంగు మొ
క్కలమున నున్న నేరము లొకానొకనాఁడును జేయ నీయెడ
న్దెలియదు శోకహేతువు వినీలశిరోజ యెఱుంగఁ జెప్పవే. 52

క. అని యడిగినభూసురునకు, ననిమిషవేశ్యాలలామ యాద్యంతంబు
న్వినిపించి మగుడ నేడువఁ, దనదుప్పటి మొగము దుడిచి తగ ని ట్లనియెన్. 53

ఉ. ఇంతె కదా లతాంగి మఱి యేమొ యటంచు విషాద మొందితిం
జింతిల నేల యిప్పుడిక శీఘ్రము శాపవిముక్తి చేసెదన్
అంతొనరింప కీక్షణమ తావయి నిల్వుము భీకరంబుగా
నెంతయు నిష్ఠురంబు కడ నేన యెఱుంగుదుఁ బైవిచారమున్. 54

చ. అన విని శుష్కహాసవదనాంబుజ యై సురకాంత పల్కె నో
యనుపమరూప నీమహిమ లట్టివ యౌఁగద శాపమోక్షణం
బొనరఁగ నెట్లు చేసెదవొకో యొకయింత వచింపరాదె నా
మనము విషాద మార్ప యొకమాటకు నంటివొ లేక తథ్యమో. 55

వ. అని పల్కిన నతండు. 56

గీ. అతివ మాట యొకటి యవ్వల నొనరించు, చేఁత యేది యైనఁ జెప్ప నేల
మాటకన్నఁ జేఁత మట్టు గాకున్నను, జేఁత ననుసరించి చెలఁగ వలదె. 57

క. నీ వీమాటకు సందే, హావిర్భావంబు నొందె నబల కఠో
గ్రావంబై పుట్టుము నా, నావేలుఁదియు నట్లు చేసె నాపురముకడన్. 58

క. శతతాళదఘ్న మగున, య్యతులగ్రావమ్ముఁ జూచి యప్పుడు భయసం
గతులై యాశ్చర్యసమా, యతులై గజగజ వడంకి రచ్చటిజనముల్. 59

క. ఆదిరా యౌన్నత్యభరం, బిదిరా విస్తారగరిమ వీక్షింపఁగ ని
ట్లిదిరా కాఠిన్యగుణం, బదిరా యిది కొండ గాక యశ్మమె తలఁపన్. 60

సీ. అస్మదాదులతోడ నాకృతి దాల్చినభాగ్యదేవతయొ యీప్రస్తరంబు
కాక లోకం బెల్లఁ గబళింప వచ్చినయాదిశక్తియొ యీమహాదృషత్తు
బలిసద్మరంధ్రంబు వెలువడి యెగసిన యురగేంద్రుఁడో యీదృషదుపలంబు
దుస్సహానిలగతిఁ దునిగి రాలినకాంచనాద్రిశృంగంబో యీయశ్మరాజ
గీ. మీసమున్నతశిల నీరజాసనాండ, పతనసంస్థాపితోజ్జ్వలస్తంభ మొక్కొ
యీభయంకరపాషాణ మినజబాహు, దండకలితసముద్దండదండ మొక్కొ. 61

వ. అని యనేకప్రకారంబుల వితర్కించి యిది మహాదుర్నిమిత్తంబు గాని వేఱొండు
గాదని నిర్ణయించి నిజనివాసంబుల కరిగి రంత దైవవశంబున. 62

ఉ. మందరధీరుఁ డన్యనృపమర్దనుఁ డాపురమేలురాజు శ
త్రుందముఁ డొక్కనాఁడు పరితోషభరంబున మంత్రులెల్లఁ జూ
డం దగ దన్న మానక హతాత్తు హయోత్తమ మొక్కఁ డెక్కి వ
చ్చెం దురుఘీలు కొన్ని తన చేరువ రా నుపలంబుఁ జేరఁగన్. 63

క. చను దెంచి నయనగోచర, మును వాగ్గోచరము గాక భువనాద్భుత మై
తనరుబలుఱాయిఁ గనుగొన, జననాథునిమది కొకింత జడుపుదయించెన్. 64

చ. అపు డచ్చో నొకరావిచెట్టున మనోజ్ఞాకారసంపత్తికి
న్విపరీతం బగుబ్రహ్మరాక్షసుఁడు నుద్వేగాతిరేకంబున
న్నృపచూడామణి నావహించె సచివుల్నిర్విణ్ణులై చూడఁగా
జపలాత్మం గనిపెట్టి యుండుఁ గద యస్వాపంబులై యాపదల్. 65

క. ఒకలాగున మాటలు తొక, తొకలై వెడలంగఁ జొచ్చె దుడిదుడి నెందే
నొకఁడ చనఁ దొడఁగెఁ గన్నులు, పెకలించుక చూడ సాగె భీతి దలిర్పన్. 66

సీ. స్వప్నంబునం దైనఁ జాపల్య మెఱుఁగనిసార్వభౌమునకుఁ జంచలత తోఁచె
నేకాంతమున నైన హెచ్చుమాటలులేనివసుధేశతిలకంబు వదరఁ జొచ్చె
బరిహాసమున కైన దరహాస మొందనినరనాథుఁ డూరక నవ్వఁ బూనెఁ
దలిరాకుఁబోఁడులొద్దను వికారము లేనిధీరుం డహేతువికారుఁ డయ్యె
గీ. సూనృతమె కాని నాలుకఁ జొనుపనట్టి, నాయకాగ్రణి దబ్బఱ ల్గూయ సాగెఁ
బసిఁడిసమ్మాళిగలులేక పాద మిడఁగ, భరముపడురాజు బరిగాళ్ళఁ బఱవ సాగె.

క. అప్పుడు మంత్రులు కార్యము, దప్పెఁగదా యనుచు మెల్ల ధరణీనాథున్
గప్పుక చని రంతఃపుర, మెప్పుడు చేరెదమొ యనుమనీష దలంకన్. 68

సీ. కాలసర్పముఁ బట్టఁగడఁగుమాంత్రికులు నా నొడిపిన నొక్కింత యొడియఁ బాఱె
వనమదేభముఁ గట్టఁ జనెడుమావఁతులు నాఁ దిరిగినవెంటనే తిరుపుగట్టె
తీవ్రప్రవాహ మీఁదెడునీఁతకాండ్రు నా వెలిబోక కాక వెంబడిన పోయి
చిచ్చార్పఁగాఁ బోవు చేర్వచుట్టములు నాఁ జుఱుకు దాఁకినఁ బోకమఱియుఁ గదిసి
గీ. యొకవిధంబున మంత్రులు యుక్తిచేత, బ్రహ్మరాక్షసనిర్వేశభరసుదుర్ని
వారబహువిధచేష్టావికారకారు, రాజవరుఁ దెచ్చి రంతఃపురంబుఁ జేర. 69

గీ. తోడుకొని వచ్చి యన్యులు చూడకుండ, నొక్కయేకాంతగృహమున నుండఁ జేసి
పదిలముగఁ గానలులు వెట్టి వెదకి వెదకి, మాంత్రికులఁ దోడితేనహస్మతిని వారు,

సీ. ఎంతమాత్రం బిది యీక్షణంబున లేదు బంతి గావించెదఁ బ్రజ్ఞ మీఱఁ
బూనిక నప్పటి పూరి మంత్రించెనే బొమ్మన్నఁ బోదె యీభూమి వెడలి
చూతుము గా పోవు బేతాళుఁ డైనను నాపేరు విన్న నిన్నాళ్ళదాఁక
దాని కేమాయె నెందాఁక నాలస్యము తెప్పింపుఁడు విభూతి తేటగలది
గీ. యనుచునొకనాఁడునొక్కొకఁడధికముగను,నించుకటుమించుగాఁబంతగించుకొనుచు
దశదిశాబంధనము చేసి ధరణినాథ, శేఖరునిఁ జేరి మాంత్రికశ్రేష్ఠులధిప. 71

సీ. నరసింహము జపింప నరసింహము జపించు నాదిభైరవమున కదియె నుడువు
శతరుద్రియముఁ బూన శతరుద్రియముఁ బూను హనుమజ్జపంబున కదియె చేయుఁ
నీలకంఠముఁ బల్క నీలకంఠముఁ బల్కు నంబాస్తవంబున కదియె నెఱపు
శ్రీరామముఁ బఠింప శ్రీరామముఁ బఠించు నష్టాక్షరిని నెన్న నదియె యెన్ను
గీ. వీరభద్ర మెన్న వీరభద్రమె తెచ్చు, శరభ మన్న నదియె సంగ్రహించు
మనుజనాథ కదమమంత్రంబు లాబ్రహ్మ, రాక్షసునకు నీళ్ళు ద్రాగినట్లు. 72

క. మొదలఁ గడుఁ బౌరుషస్థితి, తుది నేమియు లేక జనులు దూషణ సేయన్
గదుపులు కదుపులు గట్టుచు, మదిలజ్జాపరతఁ జనిరి మాంత్రికు లధిపా. 73

సీ. ఐతిహాసికమాళి యనిపించు నొకవేళ నొకవేళ శుష్కతార్కికత నెఱపుఁ
బాణినీయపుఫక్కి వాదించు నొకవేళ నొకవేళ వేదాంత ముపచరించు
శ్రోత్రియాగ్రియవృత్తిఁ జూపించు నొకవేళఁ నొకవేళఁ గడుజ్యౌతిషికతఁ దనరు
సంగీతమాధురి చవిదేల్చు నొకవేళఁ నొకవేళఁ సుకవితాయుక్తి వరలుఁ
గీ. జదువునొకవేళఁ గావ్యము ల్సరసఫణితి, నుడువునొకవేళ మంత్రము ల్వూర్ణ వేలు
సామవేదము నొకవేళఁ జదువుచుండుఁ, బ్రతిభమీఱఁగ నాబ్రహ్మరాక్షసుండు. 74

వ. ఇట్లు సకలమంత్రతంత్రంబులకు నసాధ్యంబైయా బ్రహ్మరాక్షసావేశంబు సంస్తంభింపక విజృంభించులాగు చూచి ప్రధాను లెల్ల నాత్మగతంబున. 75

ఉ. మొత్తఁగఁ జొచ్చె గౌరవసమున్నతి వాయఁగ భూతవైద్యులం
దొత్తుల మొత్తినట్లు కడుదుర్భరభావము నొంది భూమిపా
లోత్తము దేహముం బడలె నున్నను గార్యము లే దికఁ న్వివే
కోత్తరబుద్ధిఁ జెప్పఁ డొకబుద్ధివిశేషము పెద్ద లందఱున్. 76

వ. అని వితర్కించుకొను చున్న సమయంబున. 77

గీ. బ్రహ్మరాక్షసువార్త నిరంకుశుండు, విని మరుత్కాంతశాపంబు వెడలఁ ద్రోయ
నిదియె తఱి యంచు వచ్చె భూమీశమంత్రు, లున్నపనిలేక చింతించుచున్నకడకు.

క. వచ్చి నమస్కారం బని, యచ్చోఁ గలపెద్ద లెల్ల నాదరమునఁ జో
టిచ్చి వసింపఁగఁ జేయఁగ, నచ్చతురాననకులీనుఁ డనియె నృపాలా. 79

ఉ. దుందుడుకాఱ శాత్రవులదోర్బలసంపదఁ జక్కఁజేసి ధా
త్రిం దనబాహుపీఠమునఁ దిన్నదనంబుగ నిల్పి భోగసం
క్రందనుఁ డై ప్రజ ల్వొగడ రాచఱికం బొనరించునట్టిశ
త్రుందము నంతవానికిని దుష్టపుదైవము కీడు దెచ్చెనే. 80

గీ. సత్యసంధులఁ జేర్చునసత్యపరులఁ, ద్రోచు ననఘుల రక్షించు దుష్టకర్మ
గల్గువారల శిక్షించు ఘనులఁ బెంచు, హీనులను ద్రుంచు దయ నిట్టినృపతి కలఁడె.

వ. అని యనేకవిధంబుల మనుజనాథు వర్ణనము చేసి పిదప దైవంబుఁ దిట్టి తలంచిన
నా కొకదైవలీల గల దంచుం బల్కి మెల్లన శరీరంబు గగురుపొడవ. 82

మ. ఒకనిట్టూరుపు పుచ్చి కన్నుఁగవ నీ రుప్పొంగఁగా నాపలేం
చి కరాబ్జంబులు మీఁది కెత్తి తనుయష్టిం గంప మేపాఱ నిం
చుక యాలాపము చేసి వెక్కసముగా శోకించి శోకించి వేఁ
డుకొనంగా నొకకొంతసేపునకు నాటోపంబు సంధిల్లఁగన్. 83

గీ. ఇపుడు పుట్టినపాపాణ మెల్లఁ గొట్టి, తుమురుగాఁ జేసి ధరణిపైఁ దూరుపెత్త
రాజుఁ బట్టినయాబ్రహ్మరాక్షసుండు, విడుచుఁగాని మఱేమిట విడువఁ డనిన. 84

క. ఇదియా నిది గాదనియెడి,సదమలబోధంబు లేక సచివావళియా
నిది మంచికార్య మనుచు, న్మది నెన్న విపత్తి మతికి మతికిం బొందెన్. 85

గీ. రాయి దిగులంగఁ గొట్టిన రాజునొడలి, బ్రహ్మరాక్షసుఁ డేగునే పార్థివేంద్ర
ధరణిపైఁ 'బృష్టతాడనా ద్దంతపతన', మనిన పరిహాసవాక్యము సార్థమయ్యె. 86

వ. ఇట్లు నిశ్చయించి వారు సకల భూప్రజల రప్పించిన. 87

క. శతతాళదఘ్నమగున, య్యతులగ్రావంబుఁ జూచి యఖిలగ్రామా
గతులైనమానవులు తమ, శ్రుతసాధనవిధులచేతఁ జూర్ణము సేయన్. 88

సీ. గబ్బిగుబ్బలమీఁది కస్తూరికాపంక మాణిముత్తెపుఁజేర్ల నంటుకొనఁగ
జాళువాబంగారు జలపోతకుచ్చుపై నొడిదారములకాంతి జడికొనంగఁ

గులుకుఁ జెక్కులలోన గురివెందతాటంకరోచులు దాఁగిలిముచ్చులాడ
నుడురాజు చెంగట నున్నరోహిణిమాడ్కి మోముపై ముంగరముత్య మలరఁ
గీ. కాలఘనకల్పకైశికాకల్పకల్ప, పుష్పగంధంబు చెక్కుల బుగులుకొనఁగ
వెలఁదిపాషాణచూర్ణంబు వెడలి నాఁడు, కడలిలోపలఁ బుట్టినక్రమము దెలిపె.

వ. ఈరీతి నన్నాతి రాతిపొడి వెడలి నిలిచిన సకలజనంబులు తమమనంబుల. 90

సీ. జొటజొటఁ గురియునో జుంటితేనియ మేని నొదవునో జాబిల్లికొదమ నుదుట
విసరునో శృంగారరసవృష్టి కొప్పునఁ దొలఁకునో యమృతంబు పలుకులందు
రాలునో కుముదపత్రములు చూపులయందు వెడలునో సింగిణివింట్లు బొమల
వెళ్ళఁబెట్టునో పూర్ణవిధుకాంతి మొగమున దిగఁ బారునో పైఁడి తెలివి మేన
గీ. వెడలఁ బొంగునో నెక్కుల విమలరత్న, దర్పణద్యోతనిగనిగల్ తఱచు గాఁగ
జోడుగూడి చెలంగునో చూడఁ గూడ, గబ్బిగుబ్బలఁ గోడెజక్కవలకవలు. 91

ఉ. గుత్తపు గుబ్బలాఁడి సుమకోమలి ముద్దులగుమ్మ మల్లిపూ
గుత్తి మెఱుంగుఁదీఁగె లతకూన మనోజురవాళి జాళువా
ముత్తెపుఁగోల చంద్రకళ మోహనమంత్రము కాంతిరాశి యీ
పుత్తడిబొమ్మ యేకరణిఁ బుట్టునొకో యుపలంపుధూళిలోన్. 92

సీ. జిలుఁగుఁబయ్యెద జాఱఁ జికిలిగుబ్బలకాంతి దిగఁ బార దిశ లెల్లఁ దెలివిపఱప
నలవోక గాఁ జూడ నసమాస్త్రనిశితమార్గణపరంపర లోకరాశిఁ బడఁగఁ
గరపంకజము లూఁపఁ గనకకంకణఝుణనాదసంపద గుమానముగఁ జెలఁగ
బ్రతిపదంబున నూపురఝుళంఝుళవిరావమున మూఁగఁబడి హంసములు దొలంగఁ
గీ. దనరు చాతుర్యధుర్యసౌందర్యరేఖఁ, దగిలి పీడనిచూపుల మగిడి డిగియ
రాక మర్త్యుల వెంటాడి రా నమర్త్య, నీరజాక్షి నిరంకుశుఁ జేర వచ్చె. 93

క. చనుదెంచి వచ్చి నిలిచిన, వనజేక్షణఁ గాఁగిలించి వసుధాసురనం
దనుఁడు నయనాంచలాశ్రులు, కొనగోరఁ దొలఁగ మీటుకొనుచుం బలికెన్. 94

క. నాకై లోకైకస్తుత్యాకారము జాతిలోన నణఁగించి మనో
వ్యాకీర్ణశోకభరమున, నాకులపడి యుండవలసె నా తరళాక్షీ. 95

వ. అన విని యయ్యరవిందదళాయతాక్షి భూసురనందనున కిట్లనియె. 96

సీ. నలునకా శనిచేతియలఁత హరిశ్చంద్రమహీపాలమౌళికా మాలకొల్వు
రోహిణీభర్తకా రాహువుచేఁ బడుపాటు పంచసాయకునకా భస్మ మగుట
వనజసంభవునంతవానికా తలఁపోక పాకశాసనునకా బ్రహ్మహత్య
యరవిందనేత్రునకా బోయచేఁ జావు హరునకా భిక్షాటనావసక్తి
గీ. ఘనుఁడు రామనృపాలునకా తలంప, నుత్కటంబైన పత్నీవియోగదుఃఖ
మెంతవానికి గాని మహీసురేంద్ర, కర్మ మనుభవనీయంబు గాక పోదు. 97

క. ఆపద లెవ్వరికైనన్, బ్రాపింపక పోవు వానిఁ బాపఁగ మిగులన్
బ్రాపగుచుట్టము గలుగుట, పో పుణ్యవిపాకఫలము భూసురవర్యా.
ఉ. ఆపదకైనబంధుజన మక్కఱదీర్చుధనంబు రోగమున్
బాపఁగఁ జాలునౌషధము పాపవిముక్తినిఁ జేయుపుత్త్రుఁడున్
గోపమడంచు తెల్వి బుధకోటికి మెచ్చగువిద్య దీనసం
తాపముఁ జూడలేనిదయ దైవవశంబునఁ గాక కల్గునే. 99
గీ. నాకు నినువంటి వినయనిర్ణయధురీణు, పొందు గలుగంగఁ గాదె యోభూసురేంద్ర
పాకశాసనదత్తశాపము దొలంగె, పరతరం బైననిర్జరత్వంబు గంటి. 100
క. అని పలికి ధారుణీసుర, తనయాగ్రణి పూర్వమైనదయ తప్పకుమీ
నిను మఱవ నేనె వత్తున్, గనియుం గనకుండఁ గా నొకానొకవేళన్. 101
చ. వినయగుణోత్తరుండవు వివేకసమగ్రుఁడ వార్యకోటిలోఁ
ఘనుఁడవు నీతిశాలి వది గాక మనోహరమూర్తి వెంతయున్
వనితకు నిన్నువంటిమగవానికవుంగిలి గల్గుటల్ మనం
బునఁ దలపోయఁ బూర్వకృతపుణ్యవిపాకము గాక కొంచెమే. 102
క. తనువుం దనువుం గూడుట, ఘనతరసంసర్గఫలము గాదు తలంపన్
మనముల్ మనముం గూడుట, యనుపమసంసర్గమహిమ యవనిసురేంద్రా. 103
క. అది గాక మనకు మదియుం, మదియుంగలసినదియింక మఱపులు గలవే
ముద మొదవఁ బోయి వచ్చెదఁ, ద్రిదివంబున కనుచు రంభ దివికిం జనియెన్. 104
సీ. చామరగ్రాహిణీస్వర్ణకంకణఝుణత్కారపోషితనటీకటకనినదుఁ
దనులతాముకుళమేధావిధాయక సౌర గాయకగేయసంకలితపులకు
ధవళసారసలసత్కాసారమతికారణాంబకాంబుజసహస్రాంచితాంగు
పర్ణితదోర్లతాస్వస్తికామరయోషిదభిరామకాంతిభాగుభయభాగు
గీ. నిర్జరాచార్యజల్పితనీతిశాస్త్ర, వచనకంపితమూర్ధపార్శ్వప్రదీప్త
రత్నమయకుండలప్రభారాజమాను, నింద్రుఁ జేరంగవచ్చెఁ బూర్ణేందువదన. 105
క. చనుదెంచి మ్రొక్కి నిలిచిన, వనితామణిఁ జూచె దివిజవల్లభుఁడు రవు
ల్కొనుకోపవహ్నికీలల, కును బొమముడి ధూమపంక్తి కొదువం దీర్పన్. 106
వ. ఇవ్విధంబునఁ గోపోద్రిక్తంబుగాఁ జూచి యిట్లనియె. 107
గీ. లంజ విటుఁ డొనర్చులాలనభరమున, మఱచె నేమొ కాక మమ్ము లక్ష్య
పెట్టదో ప్రభావపేశలత్వమున లే, కున్నశాపభీతి నొందకున్నె. 108
వ. అని రంభ నుద్దేశించి. 109
గీ. తొలుతఁ జేసినట్టిదుష్టకర్మంబున, సంగ్రహింపరానిశాప మొంద
సద్రసంపునడకఁ జరియింపు మిపుడైన, మగువయోజ మాన మందుగలదె. 110

క. ఘూవలయంబునఁ బలురా, హై వెలయుమ టన్న విభవమాసపడి దివిక్
నీ వెంతచుట్టఁబెట్టినఁ, బోవునె శాపంబు భోగమునఁగా కబలా.

క. అని కోపగించి పల్కిన, యనిమిషవిభునకును మ్రొక్కి యది వినిపించెన్
దను శపియించుట మొదలుగ, ఘనతరశాపోపశాంతి గడపల గాఁగన్. 112

క. ఓహో యింతయు పాయస, మోహితుఁడా విప్రసూతి యటుఁ గా కున్నన్
సాహసికుఁడై జయించునె, యాహా నెయ్యంబుతోడ హరు జూదమునన్. 113

మ. సొగటా లాడి హరుం జయించినజనస్తోత్రవ్యచారిత్రుఁడా
జగతీదేవకుమారుఁ డాతనికి నీశాపంబు వారించు నెం
త గణింపం గనుఁగో ముకుంబ బోదవె నద్ధాత్రీసురుం జూత మం
చు నిజశ్వేతగజేంద్రము నెక్కి వచ్చె హరి యస్తోకోన్నతిన్ ధాత్రికిన్. 114

క. సురరాజు వచ్చెఁ జనుదెం, చిరి తమవాహనములు చెలఁగఁగ విద్యా
ధరగుహ్యకాప్సరసకి, న్నరకింపురుషసిద్ధనాకనివాసుల్. 115

వ. అట్లు వనకుం బ్రసన్నుఁడైనదేవేంద్రునకు దండప్రణామంబులు చేసి యాభూసుర
నందనుం డిట్లనియె. 115

సీ. బలవృత్రనముచిజంభపులోమముఖదైత్యవన వహ్నిహేతి యెవ్వానిహేతి
చిత్రసంగరజయశ్రీకరగ్రహణ నిర్వహణవిహస్త మెవ్వానిహస్త
మనఘకర్మాయాతఘనతరైశ్వర్య నిర్వ్యథపుణ్యాలోక మెవ్వానిలోక
మసమానకారుణ్యరసపక్షిలోచన జనజనికాయ మెవ్వానిలోక
గీ. మమరవనమధ్యకేళిసౌధాంతరాళ, వర్ణ్యతరసంప్రచరణ మెవ్వానిచరణ
మట్టిలోకైకవందితు నప్రమేయుఁ, నిన్ను వర్ణింపఁగా నేర్తునే సురేంద్ర. 117

శా. వంశారణ్యముఁగాల్చు పావకుగతిన్ వర్ధిష్ణువై విద్విష
ద్వంశారణ్యము నిర్దహించు భవదుద్దామప్రతాపాగ్ని శీ
తాంశుస్ఫారయశుస్సంశ్రితావళికి నీయాకారరేఖల్ త్రయ
స్త్రింశత్కోటిసుపర్వనాథుఁడవు కీర్తింపన్నినున్ శక్యమే. 118

గీ. తగఁ బరాగము గప్పినతమ్మికొలను, మాడ్కి హరిచందనాలిప్త మగుచు వేయుఁ
గనులతో నొప్పు నీయుదగ్రప్రదీప్త, తనువుఁ గీర్తింప నేర్తునే యనిమిషేంద్ర. 119

వ. అని యనేకప్రకారంబులం గీర్తింప నన్నిలింపసార్వభౌముండు. 120

ఉ. మెచ్చితి నీప్రవీణతకు మేలు ధరాసురవర్య వేఁడుకో
మ్మిచ్చెద నీకభీష్టమన నెంతయు సమ్మదమంది వాంఛితం
బిచ్చెద వేని నా కనిమిషేశ్వర యీధరణీతలేశ్వరున్
సచ్చరితాగ్రగణ్యు గ్రహసంభృతు నిగ్రహుఁ జేసి కావవే. 121

చ. అన నిది యెంతమాత్రము ధరాసురనందన వేఁడు మింక నొం
డనుపమ మైనకోర్కి యన నాబలసూదనుతోడ బ్రాహ్మణుం

దనిమిషలోకనాథ విబుధాబ్జముఖీమణి రంభ పట్టునన్
జన దభిలాష మేమియును సారసగంధిని నా కొసంగవే. 122

ఉ. నా విని నవ్వి యవ్విబుధనాయకుఁ డిట్లను విప్రసూతితో
నోవిటసార్వభౌమ వికచోత్పలలోచన రంభ నిత్తుఁ గా
కావసుధాస్థలిన్ దివిజకాంతల కుండఁగరాదు వచ్చుచుం
బోవుచు నుండు భూర్తకి భోగముఁ జేకొను పూర్వరీతిగన్. 123

వ. అని యనేకదండప్రణామంబులు సేసి నిలిచిన. 124

శా. రింఖాపాత్రమునం జదల్ గదల నిర్విచ్ఛేదవారానిల
ప్రేంఖద్వాతపరంపరల్ దెసల నాభీలంబుగాఁ బర్వవై
శృంఖల్యంబునఁ బట్టిపల్లవుసిరుల్ చేర్వార నుచ్చైశ్రవః
కంఖాణంబు గదల్చె వాసవుఁడు దిక్పాలాదిసంసేవ్యుఁ డై. 125

సీ. అప్పు డారాజు భూతావేశనిర్ముక్తదేహుఁ డై కాంతిసందీప్తుఁ డయ్యెఁ
నదనంతరమున రత్నంబుల నభిషిక్తుఁ జేసిరి మంత్రులు భూసురేంద్రు
నాపిమ్మట నృపాలకాంతగపురస్త్రీలు తమతమసొమ్ము నెంతయు నొసంగి
రటుతరువాత దేవాంగనామణి యగు రంభ యేతెంచి సంరంభ మొదవ

గీ. గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి యోగుణసముద్ర, నీకతన శాపమోక్షంబు నాకుదొరకె
నీవలన నచ్చరలలోన దేవ గంటి, నిన్నుఁ గూరిచి హరియు మన్నించె నన్ను. 126

క. వినవోయి నిరంకుశ నీ, కును నాకును లోకభర్త కూర్చినయిష్టం
బునఁ బాయ మని యెఱుంగుము, చనియెద నిప్పటికి మగిడి చను దెంతుఁ జుమీ. 127

క. అని యనిమిషభామిని వో, యినపిమ్మటఁ దల్లిదండ్రు లెంతో సంతో
షనితాంతహృదయులైనపు, త్రునిఁ గౌఁగిటఁ జేర్చి పులకధూర్వాతనులై. 128

క. తనయా నిన్నింత నయా, ఘ్న్యుని ప్రాప్త మెఱుంగ లేకయొకమానవమా
త్రునిఁ గాఁగఁ జూచి నిరసిం, చినయపరాధంబు నారసి క్షమింపఁగదే. 129

సీ. ఒకనికి శక్యమే యురగభూషణుతోడ నలఘుచాతురి జూద మాడి గెలువ
గెలిచెఁ బో యొకనికిఁ దెలియునే సామాన్య రమణుల నడుగక రంభ నడుగ
నడిగెఁ బో యొకనికి నలవియే సురకాంతలాలించి భూమి నిల్లాలిఁ జేయఁ
జేసెఁ బో యొకనికిఁ జెల్లునే చిరభోగ్య మగునింద్రశాపంబు నపుడె మాన్ప

గీ. నీకుఁ దక్కఁగ వికచనాళీకలోచ, నామనోహరదేహసౌందర్యధుర్య
తానివారితశీతలధామసోమ, ధరకృపాపాత్రపుత్ర కందర్పదర్ప. 130

క. అని వినుతి సేయుజననీ, జనకుల బహుళార్థములను సంతుష్టులుగా
నొనరించి రంభయనుమతిఁ, దనయంగనయందు సునయతనయులఁ గాంచెన్. 131

వ. మఱియును నత్తండు వృషవాహనపదధ్యానాసక్తమానసత్త్వపరాయణపరిప్రాప్తవిజ్ఞానపాటవంబున నేకవాక్యప్రతిష్ఠాపనాచార్యుండును ద్విజవంశపావనుండును త్రివర్గనిరతుండును జతుర్వేదపరాయణుండును బంచశరాకారుండును షట్ఛాస్త్రపారీణుండును సప్తాశ్వతేజుండును నష్టభోగసంపన్నుండును నవనిధానసంపన్నుండును దశదిశాపూరకీర్తిమండలుండును నై చెలంగె. 132

క. ఏటువంటి గురాచారున, కెటువంటిజగత్ప్రసిద్ధి యెఱిఁగితె రాజా
యటుగానఁ బూర్వపుణ్యో, త్కటభావం బల్పునైన ఘనుఁగావించున్. 133

చ. అని ముని ధర్మశీలవసుధాధిపమౌళికి నేర్పరించిచె
ప్పినకథ బాల్యచాపలము పెంపున స్వామికి విన్నవించితిన్
జనకుఁడు బాలుఁ డాడునపశబ్దవచోనివహంబుచేత నె
మ్మనమున మోదమందుక్రియ మామకవాక్కుల సంతసిల్లుమీ. 134

మ మదనధ్వంసక తారభూమిధరధామా ధామధామాక్షసం
మదసంధాయక దివ్యనామ నిజవామావామవామాంగ దు
ర్మదదంతావళదానవప్రవరభీమా భీమభీమత్వసం
పదగారీకృతదుష్టదైత్య ధృతసోమా సోమసోమేశ్వరా. 135

శా. భస్మోద్ధూళితదేహపోషణకళాపారీణ వారాకరా
కస్మాదుద్ధితకాలకూటవిషదిగ్ధగ్రీవ పాదాంబుజా
త స్మర్తృప్రజకల్పభూజ కరుణాధన్యేక్షణా సేవమా.
నా స్మర్తృప్రత్రకమత్తనాభవకనాగాఖ్యాంకలింగాహ్వయా. 136

క. అతులతరసోమవార, వ్రతనియమధురీణహృదయవారిజ సాధ్వీ
శతవినుత చెన్నమాంబా, ప్రతిదినసంసేవ్యమానపదపంకేజా. 137

గద్య. ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధవర్ణవర్ణనీయకవిత్వతత్త్వధౌరేయ పెదలింగనార్యగర్భార్ణవపూర్ణిమాత్రేయ గురువరాచార్యపదారవిందమిళిందాయమానమానస సకలవిద్వజ్జనవిధేయరుద్రయనామధేయప్రణీతంబైననిరంకుశోపాఖ్యానం బనుమహాప్రబంధమ్మునందు సర్వంబుఁ జతుర్థాశ్వాసము.